# సంపాదకునకు లేఖలు

## మేదూరు వైద్యశాల

(జులై 3వ తేదీ 'ఆంధ్రపత్రిక'లో పై శీర్షిక క్రింద సుల్లపల్లి గెన్డెయ్యగారు ప్రకటించిన సంపాదక లేఖకు సమాధానం. సం.)

ఆర్యా, కృష్ణాజిల్లాలోని మేదూరు పెదపూడి, వేస్నూరు గ్రామాలలోని జిల్లా బోర్డు వైద్యశాలల్లో చాల కాలంగా డాక్టర్లు లేని మాట నిజమే. ఈ వైద్యశాలలకు ఎల్.ఐ.ఎం.పి. పట్టా కలిగి వున్నవారు కావాలి. ప్రకటన చేసినా, ఎవ్వరూ దరఖాస్తు చేయలేదు.

విజయవాడ : కాకాని వెంకటరత్నం.
కృష్ణాజిల్లాబోర్డు అధ్యక్షుడు

## గుప్పడిపేట ప్రజల కడగళ్లు

ఆర్యా, నరసన్నపేట తాలూకా సముద్రప్రాంతి గ్రామాలలో ఒకటైన గుప్పడిపేట గ్రామంలోవున్న 2500ల మంది చేపలవ్యాపారంతో జీవించేవారు. సుమారు 5 సం॥ల నుంచీ వీరివలలకు నూలు సప్లయి లేక వీరి వృత్తి యించు మించుగా పోయింది. ఇదివరకు చిర కాలంగా అక్కడ వున్న చేపల 'యార్డు'ను కూడా ప్రభుత్వం ఎత్తివేసింది. చౌకధరల డిపోలు పెట్టమని ఎంతో ఆందోళన చేయగా యీ ప్రాంతంలో అక్కడక్కడ కొన్ని డిపోలు స్థాపించారు. కొందరికి మాత్రం రేషన్ కార్డులు యిచ్చారు. ఈ కార్డులున్న వారికైన సరఫరా చేయాలంటే ఆ డిపోలలో ఏ నాడూ తిండిగింజలు వుండవు. వారికి త్రాగేనీరు కూడా కరువు. ప్రభుత్వానికి ఎన్నిమహాజర్లు పెట్టుకొన్న ఒక్క సదుపాయం కూడా జరుగలేదు. దిక్కులేని 300ల కుటుంబాలు గ్రామం వదిలి కలకత్తా, అస్సాం ప్రాంతాలకు వలస వెళ్లారు. జులై నుంచి సెప్టెంబరు వరకు చేపలు పట్టబోరు కాబట్టి, యీలోగా వారికి వెంటనే నూలు సరఫరా చేయిస్తే, వలలైనా బాగుచేసు కొంటారు. ఇప్పుడున్న డిపోలకు గింజలు సరఫరా చేయించి, మరి కొన్ని డిపోలు స్థాపించి అందరకూ రేషన్ కార్డులు యిప్పించి ప్రభుత్వం వీరికి వెంటనే సహాయం చేయవలసిందిగా ప్రార్థిస్తున్నాను.

శ్రీపాద వెంకట జగన్నాథరావు,
ప్రియాగ్రహారం.

## చీపురుపల్లి తాలూకాలో కరువు పనులు

ఆర్యా, చీపురుపల్లి తాలూకాలోని క్షామ పరిస్థితులనుగూర్చి పలుమారులు ప్రభుత్వానికి విన్నవించగా, 7-11-50 న జిల్లా కలెక్టరు, మరి కొంతమంది అధికారులు యీ తాలూకాలో పర్యటించి కాటక పరిస్థితులను గుర్తించి, కరువు పనులను ఆరంభించ వలసిన ఆవశ్యకత వున్నదనే అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. అందుకు అప్పటిలో సంతోషించాం. కానీ-యీనాటివరకు తాలూకాలో ఎక్కడా కరువుపనులు ప్రారంభమే కాలేదు. నీటి వనరులు మరామత్తు కూడా ఆరంభించలేదు. సర్వత్రా దారిద్ర్యం తాండవమాడుతూ వున్నది. వృత్తులు కోల్పోయి ఆకలి మంటలకు ఆగలేని బీదవారు బిక్షాటనము వల్లనైనా బ్రతికి వుండగలనునే ఆశతో యితర ప్రాంతాలకు వలస పోతున్నారు. ప్రభుత్వం యిప్పటికైనా యీ తాలూకా ప్రజల దుస్థితిపట్ల సానుభూతి ప్రకటించగలదని ఆశిస్తున్నాను.

చీపురుపల్లి : చౌదరి సత్యనారాయణ.

## లేఖాంశాలు

కాలువలువదలి యిప్పటికి నెలగావలసైన కొన్ని చోట్ల యింకా జల్లకట్టులు వేయలేదని దద్దనాల లక్ష్మీ సత్యనారాయణయ్య (తాడేపల్లిగూడెం) గారు ఫిర్యాదు చేస్తున్నారు.

అధికాహారోత్పత్తికిగాను రసాయనిక ఎరువులు రైతులకు తక్కువ అప్పు పద్ధతిపై యిచ్చే కార్యక్రమంలో వ్యవసాయశాఖ డిమాన్‌స్ట్రేటర్లుకాక, మేస్త్రీలను ప్రచారానికిగాను పంపుతున్నారని, భూమి చూడు దినుసుండా అని అడిగిన రైతులకు మేస్త్రీలు సమాధానాలు యీయలేక పోతున్నారని కోన ఆదినారాయణ (కృష్ణాపురం-గన్నవరం తాలూకా) గారు అంటున్నారు. ఇట్టి ప్రచారంలో శాస్త్రజ్ఞానంకల డిమాన్‌స్ట్రేటర్లే పాల్గొని రైతులను ప్రబోధించ వలసిందిగా కోరుతున్నారు.

వరంగల్లు పోస్టాఫీసుకు వచ్చిన వుత్తరాలలో ఉర్దూలో కాక యితర భాషలలో చిరునామాలువున్న వాటిని బట్వాడా కనీసం 15 రోజులపాటైనా జాగు అవుతున్నదనీ, అందుకు కారణం ఆ ఆఫీసులో అన్ని భాషలలో ఉన్న చిరునామాలు చదివే సిబ్బంది లేకపోవడమేనని ఎస్. ఆర్. సూర్యనారాయణరావు (వరంగల్లు) గారు అంటున్నారు. కార్డు 1 కి సైజాం డబ్బు 0-1-6, కవరు 1 కి 0-3-0 చొప్పున అమ్ముతున్నారని, అదైనా అందరికీ దొరకటంలేదని ఫిర్యాదు చేస్తున్నారు.

నిన్న వరంగల్ తాలూకా కృష్ణాపురం పూసి సెర్వుకు రెండు ప్రక్కల సైడ్ కాలువలు వేసిన కంకరరాళ్లు నీరువు లేక కట్టలు లోపలి పడిపోవటం కారణంగా, వర్షం వస్తే ప్రమాదం ఏర్పడే పరిస్థితి వున్నదనీ, అధికారులు వెంటనే ఆ కాలువలను సరిచేయించమని కోరుతున్నారు.

# రాష్ట్ర వార్తలు

## గుడివాడ

చౌక్కా చలపతిరావు గారిక్కడ స్థాపించిన ఆదర్శ సేవాసమితి ఆధ్వర్యాన 'ఆదర్శ గ్రంథాలయం' ఏర్పడింది. దీనిని ఈ 1 న గోపరాజు రామచంద్ర రావు గారు ప్రారంభించారు. రెమిల్లి చినరత్నంగారి అధ్యక్షతను జరిగిన బహిరంగసభలో మూ. రావూరావు, ఎం. జడ్. అన్సారీ, మనోరమ, అర్జునరావు, చలపతిరావుగార్లు సమితి ఆశయాలను వివరించారు. రాత్రి సమష్టి విందు జరిగింది.

## భీమవరం

పశ్చిమ గోదావరిజిల్లా గ్రుడ్లపుళ్ళి, ఎనుమతిదార్ల సంఘ సమావేశం కోపెల్ల వారి సత్రంలో యీ 1 న గొట్టుముక్కల భీమరాజు గారి అధ్యక్షతను జరిగింది. కార్యవర్గ అధ్యక్షుడుగా ఎస్. ఎస్. రాజు, కార్యదర్శిగా ఎ. అప్పారావు, సభ్యులుగా మరి 6 మందిని ఎన్నుకొన్నారు. గ్రుడ్ల రవాణాలకు తను సౌకర్యాలు కల్పించమని రైల్వే అధికారులను, గుడ్ల అమ్మకంపై పన్ను తొలగించమని ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానాలు చేశారు.

## బరంపురం

కొత్తగా కట్టబడిన కోర్టు భవనంలో న్యాయవాద సంఘంవారు న్యాయ శాఖోద్యోగులకు, కొందరు పౌరప్రముఖులకు గత 30 వ తేదీ రాత్రి ఆతిథ్యమిచ్చారు. ఇచ్చట న్యాయవాద సంఘం పూర్వపు సభ్యుడై యిప్పుడు ఒరిస్సా హైకోర్టు జడ్జిగా ఉన్న న్యాయమూర్తి శ్రీ లింగరాజు పాణిగ్రాహి గారు కూడా హాజరయినారు.

## శ్రీకాకుళం

స్థానిక సినిమా ప్రేక్షక సంఘ అధ్యక్షుడుగా ఎన్. జి. రావు, కార్యదర్శిగా జె. వి. ఎస్. రావు, సభ్యులుగా దానయ్య భాగవతార్, పి. వి. సూర్యనారాయణ, ఎం. వి. శివరావు గార్లు గత 24 న ఎన్నికయినారు.

ఈ జిల్లాలోని హోమియో పతి వైద్యులు యీ 1న డా॥ ఎల్. సూర్యలింగంగారి అధ్యక్షతను సమావేశమైనారు. ప్రస్తుతము తమసంఘ పరిస్థితులను, తమ సంఘానికి, ప్రభుత్వానికి గల సంబంధములను గూర్చి చర్చలు జరిగాయి.

## తాడికొండ

ఇక్కడ యీ 1 న బండారు వందనంగారి అధ్యక్షతను జరిగిన సభలో ఆప్కికట్లజోసఫ్ గారుపున్యసిస్తూ హరిజనులకుపలె నే హరిజన క్రైస్తవవిద్యార్థులకు కూడ సెకండరీ మిడిల్ స్కూళ్లలో వుచిత విద్యా సౌకర్యం ఏర్పడాలన్నారు. వ్యవసాయకూలీల కనీస వేతనాలను కేంద్ర ప్రభుత్వం వెంటనే నిర్ణయించాలని కనిష్ఠ, గరిష్ఠ భూవసతులు పరిమాణాలు, 20, 40 ఎకరాలుగా నిర్ణయించాలని ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానాలు చేశారు.

## వల్లిపాడు

సెల్లూరు తాలూకాలోని యీ గ్రామంలో ఇటీవల యువజన సంఘం వారు సమావేశమై 'శాంతి సంఘాన్ని' స్థాపించుకొన్నారు. ఈ సంఘానికి అధ్యక్షుడుగా ఎన్. వెంకటసుబ్బయ్య కార్యదర్శిగా సి. బొమ్మయ్య, సభ్యులుగా ఎం. గోవిందయ్య, కె. కోటయ్య, ఎన్. వెంకయ్యగార్లు ఎన్నికైనారు.

## కెక్కలి

శ్రీకాకుళం జిల్లా కలెక్టరు షేక్ ఆహమ్మదుగారి అధ్యక్షతను గత 30 న స్థానికబోర్డు హైస్కూలులో హరిజన దినోత్సవం జరిగింది. హరిజనోద్ధరణ కార్యక్రమాన్ని గూర్చి అధ్యక్షుని ప్రసంగానంతరం బాల బాలికలకు తిను బండారాలు పంచి పెట్టారు.

## వాసుదేవ పట్టణం

పాలకొండ తాలూకాలోని యీ గ్రామంలో సీతంరాజు సాంబశివరావు గారి అధ్యక్షతను ఇటీవల బహిరంగ సభ జరిగింది. యర్రమిల్లి రాజశేఖర రావుగారు నేటి పరిస్థితులను గూర్చి వుపన్యసించారు.

## నిడదవోలు

పశ్చిమ గోదావరిజిల్లా హిందీ పండితుల పరిషత్తు సర్వసభ్య సమావేశం స్థానిక హైస్కూలులో యీ 1 న వల్లమాని సోమశేఖరంగారి అధ్యక్షతను జరిగింది. హిందీభాష బోధనకు స్కూలు తరగతులలో వారానికి కనీసం 4 గంటలైనా ప్రత్యేకించమని అధికారులను కోరారు. పీరియడ్ లలో సంబంధం లేకుండా ప్రతిస్కూలు లోనూ ఒక మొదటిగ్రేడు పండితుణ్ణి నియమించవలసిందిగాకూడా కోరారు. నూతన కార్యవర్గ అధ్యక్షుడుగా సంఘం వెంకట్రామయ్య, కార్యదర్శులుగా వలివలి వీర్రాజు, గ్రొవ్విడి సుబ్బారాయుడు, సభ్యులుగా సుత్తి ఆంజనేయ సూరి, రాయల అప్పారావు, గూడపల్లి నరసింహారావు, పెయ్యేటి వెంకటసుబ్బారావు, అక్కినేని సూర్యప్రకాశరావు, పింపాటి వెంకటేశ్వర్లుగార్లు ఎన్నికైనారు.

## పీచర

ఈ గ్రామంలో సివల్ పీ యి న్ గా పనిచేసిన లక్ష్మీనరసింహారావు నాయుడుగారికి జరిగిన సంబర్భంలో, వీరి గౌరవార్థం రైతులు యీ 1 న తేనీటివిందు చేశారు. తాలూకా నంబర్లకు బదిలీ అయిన గ్రామానికి వచ్చిన శ్రీ సివల్ పీయిన్ గారికి నరసింహారావుగారు లిమిక్కిచ్చిన స్వాగతానికి తను సమాధానమిచ్చారు.

## విజయవాడ

గాంధీనగరంలో శ్రీ సత్యనారాయణస్వామి జీవాలయ నిర్మాణ సంఘం వారు, జూన్ 21 నుంచి 27 వరకు రమాదేవి, సత్యనారాయణ, ఆంజనేయ, నవగ్రహ విగ్రహ ప్రతిష్ఠలను, ధ్వజస్తంభ శిఖర ప్రతిష్ఠాపనోత్సవాలను అతి వైభవంగా జరిపారు. సుందా కృష్ణమూర్తి,ఎనాదేటి వెంకటసుబ్బయ్య, మల్లాది దక్షిణామూర్తి, దిట్టకవి వీరరాఘవయ్య, వేమూరి దక్షిణామూర్తి, పోతుకూచి సుబ్రహ్మణ్యం, సుందునూరి కృష్ణమూర్తిగారలు ఈ ప్రతిష్ఠాపన మహోత్సవాలను శ్రద్ధతో నడిపారు. క్రీయుతులు కోట వెంకటచలం శిష్ట్లా చంద్రమౌళీశ్వరశాస్త్రి, ప్రభాకర ఉమామహేశ్వరం, చివుకుల వెంకటరమణయ్య, ముద్దులపల్లి మాణిక్యాల శాస్త్రి, రాణీప్రసాద జైనులు మొదలైనవారుధార్మికోపన్యాసాలు చేశారు. కొమ్ము వెంకటచలం, సుడిపాటి శ్రీరామమూర్తి, వలివేటి అనసూయాదేవి గారలు హరికథలు చెప్పారు.

## కొత్తవలస

విశాఖ జిల్లాబోర్డు అధ్యక్షులు గొట్టిపాటి బుచ్చి అప్పారావు గారిచే శృంగవరపు కోట తాలూకాకు చెందిన యీ గ్రామములో యీ 1వ తేదీన మాధ్యమిక పాఠశాల తెరువబడెను. ఆ సందర్భమున జరిగిన బహిరంగ సభకు జిల్లాబోర్డు అధ్యక్షుడు, డివిజనలు ఇంజనీరుగారు, జిల్లా పంచాయతీ ఆఫీసరు, జిల్లా హెల్తు ఆఫీసరు, అసిస్టెంటు హెల్తు ఆఫీసరు, అసిస్టెంటు ఇంజనీయరు, తహసీలుదారు, జిల్లాబోర్డు ఎడ్యుకేషనల్ ఆఫీసరు, జిల్లాబోర్డు సభ్యులు తదితర పురప్రముఖులు ప్రాంతీయ నాయకులు విచ్చేశారు.

తీగల వెంకటరమణయ్య సోదరులు వారి తల్లిగారి జ్ఞాపకార్థమై పాఠశాల భవనమును కట్టించారు. శ్రీ తీగెలబాల గురువులు గారు వారి తండ్రిగారి జ్ఞాపకార్థమై కట్టించ దలచిన హాస్టలు భవనమునకు గొట్టిపాటి బుచ్చి అప్పారావుగారు శంకు స్థాపన చేశారు.

## రాజమండ్రి

ఇచ్చట హితకారిణీ సమాజమువారి 44 వ వార్షికోత్సవం విస్సా అప్పారావుగారి అధ్యక్షతను గత 30 న జరిగింది. వీరేశలింగం ఆస్తిక గ్రంథాలయపు గుద్దణ కార్యక్రమాన్ని సభాధ్యక్షుడు నెరవేర్చారు. కార్యదర్శి దంగేటి నారాయణస్వామిగారు నివేదికలు సమర్పించారు. వీరేశలింగంగారి ప్రతిభనుగూర్చి వెన్నేటి సత్యనారాయణ, తారకంగార్లు వుపన్యసించారు.

ఈ పట్టణ యువజనకాంగ్రెసు సర్వసభ్య సమావేశం చామకూర శ్రీనివాస రావుగారి అధ్యక్షతను యీ 1 న జరిగింది. తమ సంఘాన్ని జాతీయ కాంగ్రెసుసంస్థకు అనుబంధం సంస్థగా వ్యవహరింపచేయ నిశ్చయించుకొన్నారు. పట్టణ యువజన కాంగ్రెసులో సభ్యులుగా నుండి ఇతర పార్టీలతో కలసి వ్యవహరిస్తున్న కొందరిపై చర్యలు తీసుకోవాలని తీర్మానించుకొన్నారు.

## వేటపాలెం

గత 30 న 'సుబ్రాయమహలు'లో స్వామి శివశంకరుల అధ్యక్షతను పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి, డా॥ చిలుకూరి నారాయణరావుగార్ల స్మారకసభ జరిగింది. అధ్యక్షుడు ఆ యిద్దరు పండితుల జీవిత విశేషాలను గూర్చి వుపన్యసించారు. సభవారు సంతాపతీర్మానం చేశారు.

## విద్యావనం

పామర్రు సమీపానగల యీ సంస్థకు సంఘం పత్రికా సంపాదకుడు గోపరాజు రామచంద్రరావు, గాంధీ సంఘ కార్యదర్శి మానికొండ సత్యనారాయణగార్లు యిటీవలరాగా, వారి గౌరవార్థం యలమంచిలి వెంకటేశ్వరరావు గారి అధ్యక్షతను సభ జరిగింది. రామచంద్రరావుగారు గాంధిసంఘ స్థాపనోద్దేశాలను వివరించారు.

## చెల్లునడా

సోంపేటతాలూకాలోని యీ గ్రామంలో నాను శాసుదొరగారి అధ్యక్షతను యిటీవల కాంగ్రెసు బహిరంగ సభ జరిగింది. గొరకల సూర్యనారాయణ, డి. దాసన్న గార్లు వుపన్యసించారు. అఖిలభారత కాంగ్రెసు సంస్థకు అనుబంధంగా కాంగ్రెసు సేవా సంఘము నొకదానిని స్థాపించుకున్నారు. ఈసంఘానికి అధ్యక్షుడుగా మల్లి బైరాగిచౌదరి, కార్యదర్శిగా బికెండి శ్రీరాములు గార్లు ఎన్నికైనారు. వార్షికగ్రామ ప్రాజెక్టు పని ఆరంభించవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానంచేశారు.

# సభలు - సమావేశాలు

కుర్తాళం (తెన్‌కాశి)లోని శ్రీసిద్ధేశ్వర పీఠాధిపతి శ్రీ త్రివిక్రమ రామానంద భారతీస్వామివారి యాజమాన్యాన ఈ 13న శ్రీ శివచిదానంద సరస్వతీ స్వామివారి సమాధిపై లింగప్రతిష్ఠ జరుగనున్నది. ఈ 18 న శ్రీ త్రివిక్రమ రామానందభారతీ స్వామివారు శ్రీ వ్యాసపూజ గావించెదరు.

జగ్గయ్యపేటకు 6 మైళ్ల దూరాన వున్న వేదాద్రిలో వెలసిన శ్రీలక్ష్మీనరసింహస్వామివారి క్షేత్రంలో శంభుని ఆనందరామ శర్మగారు యీ 11 నుంచి 18 వరకు శ్రీ రామచంద్ర సప్తాహం చేస్తున్నారు.

జగ్గయ్యపేట సబ్‌తాలూకా గ్రామాధికారుల సమావేశం జగ్గయ్యపేట కోఆపరేటివ్ మార్కెటింగ్ సొసైటీలో యీ 20 న జరుగుతుంది.

## ప్రమోదం

[illegible] జులై 7: ప్రకాశం పంతులుగారు నిన్న రాత్రి బెంగుళూరు వెళ్లారు.

# కృష్ణాజిల్లా ఆహారోత్పత్తి సంఘం

బందరు, జులై 4: కృష్ణాజిల్లా ఆహారోత్పత్తి సంఘసభ్యులు నిన్న కలెక్టరుగారి కార్యాలయంలో పి. ఎం. నాయక్ గారి అధ్యక్షతను సమావేశమైనారు. సభ్యులుఆహారోత్పత్తిలోకార్యక్రమమునుపట్ల శ్రద్ధవహించి, అధికారులు అమలు జరపేనాటినిగూర్చి విమర్శలు, అమలు జరుపవలసిన వాటినిగూర్చిన సలహాలు పంపటంలేదని కలెక్టరు గారు అన్నారు. సైతులోకంలో పలుగే యీ అనధికారసభ్యులు శ్రద్ధ వహించకపోవటం శోచనీయమన్నారు. కృష్ణా సెంట్రల్ డివిజనులో 9 స్కీములు అమలు జరిగాయని ఆ డివిజన్ ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు గారు తెలిపారు.

రసాయనికఎరువులు, అప్పు పద్ధతులనుగురించి చెప్పే సందర్భంలో జిల్లా వ్యవసాయ శాఖాధికారిగారు దినుసు, అంకాలు వల్లించారు. ఎరువుల క్రయానికి రైతులకిచ్చే వడ్డీలేని అప్పులకుగాను యీ జిల్లాకు ప్రభుత్వం కేటాయించిన రు. 11 లక్షలలో యిప్పటికి రు. 5,25,000/- లు మాత్రమే రైతులకు యిచ్చారు. రసాయనిక ఎరువుల విక్రయానికి తాలూకాలలో విరివిగా డిపోలు స్థాపించవలసిందిగా సభ్యులు కోరారు. పరపతి సంఘాలు ఎరువులను విక్రయిస్తాయని సహకారశాఖ డిప్యూటీ రిజిస్ట్రారు గజపతి రావుగారు తెలిపారు.

ఈ సంఘ సభ్యులు 6 నెలల కొకసారి కాని, సంవత్సరానికి ఒకసారి కానీ సమావేశమై ఇరిగేషన్ స్కీములను గూర్చి చర్చించ వలసిందిగా కోరుతూ కేంద్ర ఆహార సంఘంవారు పంపిన లేఖను కలెక్టరుగారు సభ్యులకు చదివి వినిపించారు. మెట్ట తాలూకాలలో కొండ వాసులకు ఆనకట్టలు కట్టాలనీ, ఇరిగేషన్ స్కీములకు సంబంధించిన ప్రతిపాదనలు అధికారులకు కాక ఆహార వుత్పత్తి సంఘానికి అందచేయాలనీ తెలియచేశారు. (స్వ. వి.)

## కృష్ణాజిల్లా సోషలిస్టుపార్టీ కార్యవర్గ ఎన్నికలు

విజయవాడ, జులై 5: కృష్ణా జిల్లా సోషలిస్టులు యీ 1 న పాతూరు వెంకటేశ్వర రావుగారి అధ్యక్షతను సమావేశమై కార్యవర్గాన్ని ఎన్నుకొన్నారు. రాబోయే ఎన్నికలలో జిల్లాలోని అన్ని స్థానాలకు పోటీచేయ నిశ్చయించుకొన్నారు. జిల్లాపార్టీ కార్యదర్శిగా గుత్తా రాజారావు, సభ్యులుగా కృష్ణశంకర్, కాశీనాథుని బుచ్చయ్య గుడిపాడి సీతారామయ్య, కర్లపాటి సత్యనారాయణమూర్తి, డా॥ లక్ష్మణరావు, ఎల్. వెంకట్రామయ్య, కె. సూర్యచంద్రరావు, దగ్గుమిల్లి మధుసూదనరావు, పాలడుగు రామమోహనరావు, సి. బి. ఎస్. ప్రసాద్, జె. వి. ఎల్. నరసింహారావు, మన్నె శివరావు, రామిసెట్టి నాగభూషణంగార్లు ఎన్నికైనారు.

రాష్ట్రసంఘ సభ్యులుగా గుత్తా రాజారావు, కృష్ణశంకర్, పి. రామమోహనరావు, కె. బుచ్చయ్య, గుడిపాటి సీతారామయ్య, కోనేరు జనార్దనరావు, కోగంటి జగన్నాథరావు, దగ్గుమిల్లి మధుసూదనరావు, సి. బి. ఎస్. ప్రసాద్, కె. రామారావు, జె. వి. ఎల్. నరసింహారావు, పి. కొండలరావు, రామిశెట్టినాగభూషణం గార్లు ఎన్నికైనారు.

ఎన్నికల వుపసంఘం, కార్మికవుపసంఘం, కిసాన్ వుపసంఘం, వైజ్ఞానిక వుపసంఘాలనుకూడా ఏర్పాటు చేసుకొన్నారు. (స్వ. వి.)

## విజయవాడలో విద్యుత్ సరఫరాకు భంగం

విజయవాడ, జులై 7: విజయవాడ రైల్వేస్టేషనుకు తూర్పు భాగానవున్న పట్టణమంతా నిన్న రాత్రి విద్యుత్ సరఫరా నిలచిపోయిన కారణంగా అంధకారంలో మునిగి పోయింది. నిన్న రాత్రి 7 గంటలకు ఆగిపోయిన సరఫరా యీ నాటి వుదయం 11 గంటలకు కానీ మళ్లీ బాగుపడలేదు. నిన్న రాత్రి, నేటి వుదయంకూడా ఆల్ ఇండియా రేడియో పనిచేయలేదు.

పవర్‌వల్ల పనిచేసే సినిమాలు మొదలైన సంస్థల తాలూకు ప్రతిపనీ నిలచిపోయింది. 'మెయిన్ కేబుల్' తునుబడి పోయినందువల్ల విద్యుత్ సరఫరా నిలచిపోయినట్లు భావించబడుతున్నది. (స్వ. వి.)

## తణుకులో ఒక స్త్రీకి శరీరము కాలుట

తణుకు, జులై 6: గిరిమెళ్ల సుబ్బారాయుడిగారి కుమార్తె ముట్నా నాగరత్నమ్మ (వితంతువు వయస్సు 45 సం॥లు)ను, శరీరము కాలి ప్రమాదావస్థలో నుండగా నిన్న స్థానికప్రభుత్వ ఆస్పత్రిలో చేర్చారు. ఆమెవద్ద మరణ వాఙ్మూలమునుకూడా తీసుకొనబడెను. ఈ సంఘటనతో సంబంధమున్నదనే అనుమానంపై స్థానిక పోలీసు సబ్ ఇన్‌స్పెక్టర్ సి. హెచ్. వెంకటేశ్వరరావు గారు జి. సూర్యనారాయణ అను వ్యక్తిని అరెస్టుచేశారు. కేసు దర్యాప్తు జరుగుచున్నది. శరీరము కాలినందున లోగడ యీ హాస్పిటల్‌లో చేర్చబడిన 3 గురిలోను యిద్దరు మరణించారు.

[illegible] జులై 7: డాక్టర్ [illegible] సీతారామయ్య గారు నిన్న [illegible] పరామర్శించి, వారి రాజీనామాను ఉపసంహరించుకోవలసిందిగా కోరారు.

# క్షామప్రాంతాల్లో గంజి ప్రదానం

## ప్రధానమంత్రినిధినుంచి సహాయం

మదరాసు, జులై 7: పంటలు లేక రైతులలో కొనుగోలుశక్తి తగ్గినచోట్ల ఆహారం పంపిణీ చేయనిమిత్తం ప్రధాన మంత్రినుండి అందిన రు. 50,000 లలో 33 వేలను 10 జిల్లాలకు పంచారు. ఇందులో చిత్తూరు జిల్లాకు 3 వేలు, శ్రీకాకుళంనకు 2 వేలు నెల్లూరుకు 2 వేలు నుంటూరుకు రు 1000, విశాఖపట్నంకు రు 1000 ఇచ్చారు. ఇదిగాక అనధికార సంస్థలను ఏర్పాటుచేసి గంజి ప్రధాన కేంద్రాలను ఏర్పాటు చేయాలని కలెక్టర్లను కోరారు. ఇందుకు అవసరమగు ధాన్యమును కంట్రోలుధరకు ప్రభుత్వ నిల్వనుండి ఇస్తారు.

చిత్తూరు జిల్లాలో పుంగనూరు, రామకృష్ణం రాజుపేట, నారాయణవనం, సెట్టేరిలలో గంజి ప్రదాన కేంద్రముల ఏర్పాటుకు కలెక్టరు వుత్తర్వు చేశారు. నెల్లూరులో ఒక కేంద్రము పెట్టి పరిశీలించుటకు నిర్ణయించారు.

## విపరీతమైన ఎండలచే విశాఖజిల్లాలో పైర్ల నష్టం

అనకాపల్లి, జులై 4: విశాఖపట్నం జిల్లాలో వర్షాలులేక తీవ్రమైన ఎండలవల్ల మెరక ప్రాంతాల ప్రజలకు ప్రాణాధారమైన గంటి, చోడి వగైరా తిండిపంటలు యెండిపోయినవి. వరి ఆకుమళ్లు మాడిపోయినవి. పల్లె ప్రజలందరు ఆకు, అలము తిని ప్రాణాలు నిలుపుకొనుచున్నారు.

పేద ప్రజలుగల యీ జిల్లాలో వెంటనే కరవు నివారణ పనులు ప్రారంభించి, ఆహార ధాన్యాలు తగినంతగా సప్లయి చేయనియెడల పరిస్థితి దుర్భరమయేట్లు కన్పిస్తున్నది.

## గోవధ నిషేధం కాంగ్రెసు ఎన్నికల ప్రణాళికలో చేర్చాలి

### ఏలూరు సభలో తీర్మానం

ఏలూరు, జులై 5: గోవులను, వ్యవసాయానికి వుపయోగపడే పశువులను, వధించడాన్ని నిషేధిస్తూ వెంటనే శాసనరూపమైన చర్య తీసికోవలసినదని భారత ప్రభుత్వాన్ని అభ్యర్థిస్తూ గత సాయంకాలం సంస్కృత పాఠశాలలో జరిగిన బహిరంగ సభవారు ఏకగ్రీవంగా తీర్మానించారు. సభకు శ్రీ బందా కనకలింగేశ్వరరావుగారు అధ్యక్షత వహించారు.

పై తీర్మానంమీద ప్రచారం చేసేందుకూ, గోవధ నిషేధం నిమిత్తం ప్రయత్నించేందుకూ పోలిసెట్టి గోపాలస్వామి (కన్వీనర్) బందా కనకలింగేశ్వర రావు, ఎం. కోటయ్యనాయుడు, పాతోలు కోటయ్య, లక్కంసెట్టి సుబ్బారావుగారలతో ఒకఉపసంఘం నియమింపబడింది.

త్వరలోనే ఢిల్లీలో జరగబోయే భారతి గోవధ నిషేధ మహాసభకు ప్రతినిధిగా బందా కనకలింగేశ్వర రావు గార్ని ఎన్నుకొని, వారినే పశుసంపదభివృద్ధికి, ఒక పథకం తయారు చేయవలసినదని సభవారు కోరారు.

రాబోయే జనరల్ ఎన్నికల నిమిత్తం కాంగ్రెసువారు తయారు చేయబోయే ఎన్నికల ప్రణాళికలో గోవధ నిషేధమూ, గోసంరక్షణ, వనస్పతి నిషేధను కాంగ్రెసు ఆదర్శాలక్రింద చేర్పవలసిందిగా కాంగ్రెసు అధ్యక్షులు బాబూ టాండన్‌గారిని కోరుతూ ఒక తీర్మానమున్నూ, ప్రతి పట్టణం, గ్రామములలో గోభూమి ఏర్పాటు చేయవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతూనూ తీర్మానాలు చేయబడినవి. (స్వ. వి.)

## చింతపల్లి మన్యానికి కాందిశీకుల వలస

### పథకం వుపసంహరించే సూచన

విశాఖపట్నం, జులై 4: ఈ జిల్లాలోని చింతపల్లి మన్యప్రదేశంలో తూర్పు బెంగాలు కాందిశీక కుటుంబాలకు వృత్తి వుద్యమాలు కల్పించే ఆలోచనను కేంద్రప్రభుత్వంవారు విరమించుకొన్నట్లు తెలుస్తున్నది. పదివేల కాందిశీక కుటుంబాలను యిక్కడ వలసఏర్పాట్లు చేయాలని ప్రభుత్వం తలపెట్టింది. ప్రభుత్వ సలహాదారు ఆర్. ఆర్. విశ్వాసన్‌గారు చింతపల్లి మన్యంలో వలస వసతులను తనిఖీ చేసినమీదట, ప్రభుత్వం యీ పథకాన్ని వుపసంహరించుకొన్నారు.

ప్రభుత్వ సహాయంతో 25 కాందిశీక కుటుంబాలు మాత్రం యీ జిల్లాలో వృత్తి వుద్యమాలు సంపాదించుకొన్నారు. కుటుంబానికి రు. 500/- మొదలు 3000/- వరకు ప్రభుత్వం సహాయం చేసింది. (స్వ. వి.)

## సొమ్ము దొంగిలించిన పోలీసుకు ఖైదువాసం

జగ్గయ్యపేట, జులై 4: రు. 50/-లు దొంగిలించిన నేరానికిగాను స్థానిక మేజిస్ట్రేటు పి. లక్ష్మణరావు గారు, ప్రత్యేక సాయుధపోలీసు పి. ఎస్. జోసఫ్ ఆదమ్ దార్ (బూదవాడ ముకాం)కు 3 నెలల జైలుశిక్ష, రు.50/-ల జుల్మానా విధించారు. నేరస్థుని నిన్న అరెస్టుచేశారు. (స్వ. వి.)

ఆంధ్రరాష్ట్ర గణకసంఘ కార్యవర్గ సమావేశం లోగడ ప్రకటించినట్లుగా యీ 8 న కాక 10 న విజయవాడలో జరుగుతుంది.

# కొలంబో ప్రణాళికల దృష్ట్యా దేశాభివృద్ధి పథకముల సవరణ

(ఆంధ్రపత్రిక న్యూఢిల్లీ విలేఖరి)

మొన్న ఆదివారంనాడు కొలంబో పథకం అమలులోకి వచ్చింది. జరిగిన రెండు గోజులుగా ప్లానింగ్ కమిషన్ నిర్వీరామంగా తన ప్రణాళికను సరిచూస్తున్నది. దీనిని ఈవారంలో ప్రభుత్వం వారికి కమిషన్ వారు అందజేయవచ్చునని అనుకుంటున్నారు. అయితే ఈ ప్రణాళికనుగూర్చి, ఇంకా కొలంబో పథకం గూర్చి అంతగావివరములు ప్రజలకు తెలియవు. అయినా కొన్ని విషయాలు మాత్రం స్పష్టంగా తెలుస్తున్నవి. ఒకటి, కొలంబో పథకం ఆరుఏండ్ల ప్రణాళిక. ప్లానింగుకమిషన్ ప్రణాళిక ఐదు ఏండ్ల ప్రణాళికమాత్రమే. ఇక ఆశయాలవిషయంలో, లక్ష్యాల విషయంలో రెంటికివున్న తేడా అంతిగా లేదు. రెండూగూడా ప్రజల జీవిత ప్రమాణాన్ని పెంచాలని ఆశిస్తున్నవే. దేశంయొక్క ఉత్పత్తిని అభివృద్ధి చేయాలని లక్షిస్తున్నవే. ఇంకోవిషయమేమిటంటే, ఈరెండుపథకాలలోను రక్షణ కార్యకలాపాలను గూర్చిన ప్రసక్తిలేదు.

కొలంబో పథకం ప్రకారం వ్యయం అంచనా 18400 మిలియన్ల రూపాయలు. ఇందులో అంతరంగికంగా పోగుచేయవలసింది 10300 మిలియన్లు. బయటినుంచి తెచ్చుకోవలసింది 8100 మిలియన్లు.

కొలంబో పథకం ఖర్చుల అంచనా ఇట్లావుంది.

| | మిలియన్లు. |
|---|---|
| వ్యవసాయం | 6656 |
| రవాణా | 7027 |
| పరిశ్రమలు | 1800 |
| సాంఘిక కార్యాలు | 1842 |
| పునరావాసం | 750 |
| ఇతరములు | 325 |
| జరసి | 18400 |

| | మిలియన్లు. |
|---|---|
| ఇందులో కోసీప్రాజెక్టు | 68.9 |
| ఉక్కు కర్మాగారం | 600 |
| పెన్సిలిన్ కర్మాగారం | 26.8 |
| రేడియో, రాడర్ ప్రాజెక్టు | 84.4 |
| విద్యుత్ కర్మాగారం | 284.0 |
| విమానాల ఉత్పత్తి | 140.9 |
| జరసి. | 1208.0 |

పాతే ప్లానింగు కమిషన్ పథకంలో కోసీ ప్రాజెక్టుగాని, ఉక్కు కర్మాగారంగాని, విద్యుత్ కర్మాగారం గాని ఇంకా చేరలేదని అందరికీ తెలిసిన విషయమే. పెన్సిలిన్ ఫ్యాక్టరీ కట్టేబాధ్యత ప్రపంచ ఆరోగ్యవ్యవస్థ తన నెత్తిమీద వేసుకొన్నది. హిందూస్థాన్ ఎయిర్‌క్రాఫ్టు కంపెనీని రక్షణ శాఖవారు తీసుకొన్నారు.

రేడియో, రాడార్ ప్రాజెక్టు భారాన్ని ఇప్పుడు ఈ ఫ్యాక్టరీవారే వహించదలచుకొన్నారు. అంటే కొలంబో పథకంక్రింద అంచనా వేయబడిన వ్యయంలోంచి ఈ అన్నింటికి అంచనా వేసిన 1208 మిలియన్ల రూపాయల ఖర్చుతెగ్గుతుందన్నమాట. అంటే, ప్లానింగు కమిషన్ వారు కొలంబో పథకాన్ని ధ్యేయంగా తీసుకొని పనిచేస్తూ వేరే ప్రాజెక్టుల నిమిత్తం 1208 మిలియన్ల రూపాయలు వేరుగా కేటాయించవలసి వుంటుందన్నమాట.

ప్లానింగు కమిషన్‌వారు ఈ అన్ని తిర్దుబాలను ఇంకా ఇతర విషయాలను దృష్టిలోవుంచుకొనే పనిచేస్తున్నట్లు సూచనలు కనిపిస్తున్నాయి. ఇందువల్లంగా కొలంబో పథకం అంచనాలను 400 కోట్లదాక తగ్గించవచ్చు. బయటి సహాయం ఏమీ వుండదనుకున్నా, కొన్ని ప్రాజెక్టులను వదిలినా, ప్లానింగు కమిషన్ ప్రణాళిక అంచనాలు కొలంబో అంచనాలకన్నా, 4, 5 వందల కోట్ల రూపాయలు ఎక్కువగానే వుంటాయి. దీనికి కారణం కొన్ని అంచనాలు అనుకున్న వాటికంటే పెరగటమే. ఉదాహరణకు దామోదరలోయ ప్రాజెక్టు ఖర్చులు కొలంబో పథకంలో 55 కోట్లుగా చేర్కొనబడింది. కాని ప్రస్తుతపు అంచనాలు అందుకు 110 కోట్లు అవుతుందని తెలుపుతున్నాయి.

ఇక ఈ పథకాన్ని అమలుజరపటంలో వున్న ఆర్థిక విషయములనుగూర్చి ఆర్థికమంత్రి శ్రీ దేశముఖ్ పార్లమెంటులో కొంత ప్రసక్తి తెచ్చివున్న కారణంగా, అది ఎట్లా కొనసాగుతుందో తెలుసుకోగల సావకాశం కలుగుతున్నది. కొలంబో పథకాన్ని నిర్వహించడం ఆర్థికంగా కొంత తలపుమించిన వ్యవహారమే. ఇందుకు ఇతరదేశాల తోడ్పాటు లేకపోతుంది అనుకున్నా మనదేశం అభివృద్ధికిగాను అంతరంగికంగానైనా ఈ మొత్తాన్ని మనం సంపాయించవలసిన అవసరం వుంది అని ఆయన పార్లమెంటులో ఏప్రిల్ 14న అన్నారు. అయితే ఇందు నిమిత్తంగా రాష్ట్రాలు కేంద్రమూకలసి 380 కోట్లు హెచ్చు ఆదాయాన్ని చేయవలసి వుంటుంది. ఇందులో మూడోవంతు కేంద్రంమీద పడుతుందనుకుంటే అది 40 45 కోట్లు వుంటుంది. ఇప్పటి ఈ పన్నుల హెచ్చింపుతో అంతిమొత్తం లభిస్తున్నది అని ఆయనే ఏప్రిల్ 28వ తేదీనాడు మళ్ళీ పార్లమెంటులో చెప్పారు. విదేశాల సహాయం లేకుండా కొలంబోపథకం నిర్వహణను దృష్టిలో వుంచుకొనే ఆయన ఈ మాటల అన్నట్లు వ్యక్తం అవుతున్నది. అంటే ఆ పథకానికిగాను 1080 కోట్ల రూపాయలను ఎట్లా పోగు చేయదలచింది ఆ మాటల్లో వ్యక్తంచేసారు. ప్లానింగు కమిషన్‌వారి ప్రణాళిక మరో 400 కోట్ల రూపాయలను ఎట్లా పోగుచేయవలసింది సూచిస్తుంది. అయితే వీటి అన్నింటివల్ల పన్నులు పెరుగుతాయన్న భయపడనవసరంలేదు. వచ్చే మూడు ఏండ్లలోను కొత్త పన్ను లేవీ వుండవని, సాధ్యంఅయితే వున్నపన్నులనే తగ్గించడమే జరుగుతుందని ఆర్థిక మంత్రి స్పష్టంగా చెప్పియే వున్నారు.

# 1953 చివరకల్లా యుద్ధానికి సిద్ధపడాలి

## ఆస్ట్రేలియా ప్రధాని హెచ్చరిక

కాన్‌బెరా, జులై 6: నేడు ఆస్ట్రేలియా రక్షణ సన్నాహాల ఓట్లు రెండవసారి చర్చించబడే సందర్భంలో ప్రధాని మెంజీస్ మూడు అంశాలుగల కార్యక్రమాన్నొకదానిని ప్రకటించారు. 1953 సం॥ చివరకల్లా ఆస్ట్రేలియా యుద్ధానికి సిద్ధం కావలెనని ఇదివరకు చేసిన హెచ్చరికను ఆయన తిరిగీ ఉద్ఘాటించారు.

తిమకు తగినఅధికారంవస్తే కమ్యూనిస్టులతో చాల దృఢంగా తమ ఈ వ్యవహరించగలమని ప్రధాని మెంజీస్ నిన్నటి పార్లమెంటు సమావేశంలో ఉద్ఘాటించారు.

కమ్యూనిస్టులతో వ్యవహరించటానికి తగిన అధికారాన్ని ప్రజలు గడచిన ఎన్నికల్లో తమకు ఇచ్చారనీ ప్రపంచమంతటా కమ్యూనిస్టులవల్లనే శాంతికి భంగం కలుగుతున్నదనీ ఆయన వాదించారు. (ఈ అంశంమీద సెనేట్‌లో తగినబలం రానందువల్లనే మెంజీస్ పార్లమెంట్ ఉభయసభలనూ రద్దుచేసి కొత్తఎన్నికలు జరిపించారు. ఎన్నికల్లో రెండు సభలలోనూసంఖ్యాధిక్యతసంపాదించారు.)

పార్లమెంటు ప్రతికూలపక్షముయిన లేబర్ పార్టీ కార్యవర్గం దీనిని ప్రతిఘటించటానికే నిన్న రాత్రి నిశ్చయించినది.

## బర్మా ఇండియాల స్నేహ ఒడంబడిక

రంగూన్, జులై 7: బర్మా ఈవేళ భారతదేశంతో 5 ఏళ్లపాటు వర్తించే స్నేహ ఒడంబడిక ఒకటి చేసుకుంది.

ఉభయదేశాలమధ్య స్నేహానుబంధములను మరింత దృఢతరం చేయడానికీ, శాంతి సఖ్యతలను సంరక్షించుకోడానికీ ఈ ఒడంబడిక వుద్దేశించబడింది. ఒకరి హక్కులను ఒకరుఒకరి స్వాతంత్ర్యాన్ని ఒకరు గౌరవించుకోటానికి ఉభయదేశాలూ ఒప్పంది పడ్డాయి.

బర్మా విదేశాలతో స్నేహ ఒడంబడిక చేసుకోవటం ఇది రెండోపర్యాయం. ఈ సంవత్సరారంభంలో బర్మా ఇలాంటి ఒడంబడికనే ఒకటి ఇండోనీషియాతో చేసుకుంది.

## రష్యాలో 19 వేల విమానాల నిర్మాణం

న్యూయార్కు, జులై 6: క్రిందటి ఏడాది సోవియట్ యూనియన్‌లో 19,000 విమానాలకు పైగా నిర్మింపబడినట్లు "ఏవియేషన్ ఏజ్" పత్రిక ఈరోజున ప్రకటించింది. ఆ దేసంవత్సరంలో అమెరికా 8000 విమానాలు నిర్మించింది.

సోవియట్ యూనియన్ నిర్మించిన విమానాలలో 8,200 ఫైటర్లు, 3,700 తేలిక బాంబర్లు, 1,200 భారీ బాంబర్లు, 1,800 రవాణా విమానాలు, 4,100 శిక్షణ విమానాలు ఇతర రకాలు ఉన్నదనీ ఆ పత్రిక వివరించింది.

## ఎన్నికల నిర్వహణకు ప్రాంతీయ ఎలక్షన్ కమిషనర్లు

న్యూఢిల్లీ, జులై 6: ప్రాంతీయ ఎలక్షను కమిషనర్లను నలుగురిని నియమించాలని ఆలోచనలు జరుగుతున్నట్లు, అందుకు పనికివచ్చే వ్యక్తుల కోసం రాష్ట్రాలు అన్నింటిలోను గాలింపు ప్రారంభమైనట్లు తెలుస్తున్నది.

అదీకాక ఎన్నికలు ప్రారంభమైన తర్వాత నెలరోజులలో అవి ముగిసిపోయేటట్లుగా ఏర్పాట్లు చేయవలసిందిగా ఎలక్షను కమిషనరు రాష్ట్రాలను ఆదేశించారని గూడా తెలుస్తున్నది.

పోలింగు ఎట్లా జరగాలి అన్న విషయంలో ప్రస్తుతం రెండు పథకాలు ఆలోచనలో వున్నాయి. ఒక పథకం ప్రకారం ప్రతి రాష్ట్రాన్ని కొన్ని భాగాలుగా విభజించి, ప్రతిభాగంలో కనీసం ఏడు రోజులలో పోలింగు పూర్తి అయ్యేటట్లు చూడవలసి వుంది. ముందు పార్లమెంటు నియోజక వర్గాలలోను, ఆతర్వాత అసెంబ్లీ నియోజక వర్గాలలో పోలింగు జరుగుతుంది.

## గుడ్లధరల పెరుగుదల ఫలితం

జబ్బల్‌పూర్, జులై 6: అన్ని రకాల గుడ్డల ధరలూ పెరిగిపోవటం వల్ల కొనేవాళ్ళెవ్వరూ లేక, ఈనగరంలో దుకాణా లన్నిటిలోనూ సరుకు గుట్టలుగా నిలిచిపోతున్నట్లు తెలుస్తున్నది.

చేనేత గుడ్డల ధరలు ఇటీవల కొంచెం పెరిగినవి కాని ఆరకాలకు గిరాకీ తగ్గినందువల్లనూ, నూలు కోటా పెరిగినందువల్లనూ ధరలు తగ్గినవి.

ఖచితమునకు నమ్మకానికి ఒక

"ఓర్" చేతిగడియారం

పురుషులకు 10½" రోల్డుగోల్డు, స్టీల్ బ్యాక్ రిస్టువాచి 15జ్యూయల్, లివర్ మూమెంటు కుషన్ గ్లాసులు

రు. 70

పి. ఆర్ & సన్సు లి.,
మదరాసు.

ఆంధ్రజాతీయకళాశాల
టెక్నలాజికల్ ఇన్‌స్టిట్యూట్
మచిలీపట్టణము.
(ఎల్. ఇ. ఇ. & ఎల్. ఎం. ఇ. కోర్సులు)

ఈ స్కూలు 16-7-51 తేదీన తిరిగి తెరవబడును. దరఖాస్తులు తీసుకొనుటకు ఆఖరు తేది 9-7-51. అభ్యర్థుల సెలెక్షను తేది 10-7-51. ప్యాసయిన ఎస్. ఎస్. ఎల్. సి. హోల్డర్లు మాత్రమే ఈ కోర్సుకు అర్హులగుదురు. కోర్సు 3 సంవత్సరములు. అనుభవముగల అధ్యాపకులు. రు. 0-9-0 లు పంపి దిగువ సంతకందారు నుండి ప్రాస్పెక్టస్, దరఖాస్తు ఫారములు తెప్పించుకోవచ్చును.

(సం.) టి. రామచంద్రరావు,
గవర్నింగ్ బాడీ మెంబరు,
మచిలీపట్నం.

నెలకు రు. 250/-

మీరు సంపాదింపవచ్చును. వరతులకు వ్రాయండి. వరతులజాబితా ఉచితం.
Midland Trading Co., Ltd.
P. Box 16605, Calcutta-4.

అబలసుధ

స్త్రీల బహిష్టువ్యాధులు, అకాలబహిష్టు, బహిష్టుబద్ధము, బహిష్టుల ఒడలునొప్పులు, తలనొప్పి, గుండెదడ, కాళ్లలాగుట, మన స్థిమితము లేకపోవుట, నిద్రపట్టకుండుట, నడుమునొప్పులు, బలహీనత, మలబద్ధము, హిస్టీరియా మొ॥ హరించును. సీసాదరి/-

వైద్య భూషణం సుబ్రహ్మణ్యం
ఇండియన్ మెడికల్ హౌస్
బకింగ్ హాంపేట - విజయవాడ. 2.
(ఒక్కటాకు వద్ద)

వేలం నోటీసు

పోలీసు డిపార్టుమెంటు.
(ఫైర్ సర్వీసెస్ బ్రాంచి)

ఫైర్ టెండర్ MSC 8074 - ఫోర్డు 1942- విజయవాడలో అన్నదాన సమాజము సమీపమున M. F. S., వర్కు షాపులవద్ద బహిరంగవేలములో 1951-వ సం॥ జూలై 16-వ తేదీ సోమవారము ఉదయము 10 గంటలకు అమ్మబడును. అమ్మకము వరతులు దిగువ సంతకదారునుండి తెలిసికోనవచ్చును.

బి. బి. శాస్త్రి,
డిస్ట్రిక్టు ఫైర్ ఆఫీసరు, మచిలీపట్టణము.

విజయ సింధూరము

స్త్రీలహిస్టీరియా. కుసుమవ్యాధులను హరించును.
తులము రు. 4-0-0

శ్రీకృష్ణ ఆయుర్వేద ఫార్మసీ
[illegible]

## ప్రకటన

అవనిగడ్డలో (కృష్ణాజిల్లా) మా ఆంధ్ర దైనిక, సచిత్రవార, భారతి మాసపత్రికలను వారి స్వంతబాధ్యతపై విక్రయించుటకు శ్రీ R. లక్ష్మణరావు గారి స్థానే శ్రీ కొత్తగా అనుమోలు కృష్ణమూర్తిగారిని 1-7-1951 నుండి నియమించడమైనది.

మేనేజరు,
ఆంధ్రపత్రిక.

